# హన్నా యొక్క చల్లటి శీతాకాలం

## ఒక నిజమైన కథ



త్రిష్ మార్క్స్

చిత్రాలు : బార్బరా నట్సన్

హన్నా ఒక నీటి ఏనుగు. తను నీటి ఏనుగులకు ఎంతో ప్రసిద్ధి గాంచిన బుడాపెస్ట్ నగరం లోని ఒక జంతు ప్రదర్శనశాలలో ఉండేది. హన్నా మరియు ఇతర నీటి ఏనుగులు సహజంగా భూమిలోనుంచి ప్రవహించే వెచ్చటి నీటి బుగ్గలలో అభివృద్ధి చెందేవి. ఆ నీటి ఏనుగులను చూసి బుడాపెస్ట్ ప్రజలు ఎంతో గర్వం పొందేవారు. హన్నాను మరియు తన స్నేహితులను వారు తరచూ, జంతుప్రదర్శనశాలలోని నీటి ఏనుగులను ప్రత్యేక గృహంలో సందర్శించేవారు.

అయితే ఒక శీతాకాలం ఎంత చలిపెట్టిందంటే జంటనగరాలైన బుధ మరియు పెస్ట్ నగరాల మధ్య నది మంచుగా మారిపోయింది. అక్కడ యుద్ధం కూడా జరుగుతోంది. ప్రజలు, జంతువులు ఆకలితో మాడిపోతున్నారు. కానీ బుడాపెస్ట్ ప్రజలు వారి ప్రియమైన నీటి ఏనుగులను రక్షించడానికి ఒక ఆలోచన చేశారు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో జరిగిన ఈ గుండెను హత్తుకునే కథను రచయిత త్రిష్ మార్క్స్ ఎంతో అందంగా చెప్పారు. బార్బరా నట్సన్ ఆ సుదూర ప్రదేశం, సమయం మనోహరంగా చిత్రించారు .

# హన్నా నీటిఏనుగు యొక్క చల్లటి శీతాకాలం





# హన్నా నీటిఏనుగు యొక్క చల్లటి శీతాకాలం

త్రిష్ మార్క్స
చిత్రాలు : బార్బరా నట్సన్

నేను చిన్నగా ఉన్నప్పుడు, ఆదివారం నాకు అత్యంత ఇష్టమైన రోజు. ఊరిబయట ఉన్న మిరపకాయల మిల్లులో ఆరు రోజుల పాటు పనిచేసాక నాన్న ఆదివారం ఎంతో విశ్రాంతిగా లేచేవారు. వేసవైన శీతలమైనా, ఆరు రోజుల పాటు నాన్న ఎండుమిరపల భారీ సంచులు రైతుల బళ్ల నుంచి దింపి మిరపను సన్నని మసాలాగా మార్చే మిరపమిల్లు మిషన్ నోట్లో పడవేసేవాడు. తన ముగ్గురు పిల్లల నోళ్లు నింపడం కంటే మిరపమిల్లు నోరు నింపడం ఒక్కటే కష్టమైన పని అని నాన్న అనేవారు.



కానీ అది వారంలో ఆరు రోజులు. ఏడవరోజున, ఆదివారం నాడు, ఎండ తనని మేల్కొలిపేదాకా నాన్న నిద్రపోగలిగేవారు. నాన్న సూటు, ఎర్ర బౌటై, తన పెళ్ళికి తన తాతగారు ఇచ్చిన బంగారు కఫ్లింకులు ధరించి వంటింట్లోకి రావడానికి వేచి ఉండేవాళ్ళం. “సరి, సరి “ అని తాను అనేవాడు, గంభీరంగా కనిపించడానికి ప్రయత్నిస్తూ “ఈ రోజు నాకు ఏ మాత్రం ప్రశాంతత ఉండదనుకుంటాను. నేను చలికాచుకుంటూ, అమ్మ చేసే చక్కటి కాఫీ తాగటానికి వేచి ఉండాలనుకుంటాను. మీరు బయటకి వెళ్లాలనుకుంటున్నారని మీ ముఖాలు చెప్తున్నాయి.









నాన్న ఆలా అన్నాలన్న ఆశతో మేము ఊపిరి బిగపెట్టుకుని ఉన్నాము. మేము, అమ్మ నాన్నతో కలిసి ఈ ఆదివారం విహార యాత్రలలో బుడాపెస్ట్ నగరమంతా ఇంకా ఊరి బయట ఊరిబయట కొన్ని పల్లెటూర్లు తిరిగేసాము. మరియు ఈ యాత్రలలో మాలో తలాఒకళ్ళకి నచ్చిన ప్రత్యేకమైన విగ్రహమే, భవనమో, ఉద్యానవనమో ఉన్నాయి. నాకు డాన్యూబ్ నది పైన ఉన్న వంతెనను  కాపలా కాసే రాతి సింహాలంటే ఎంతో ఇష్టం. మా చెల్లి జెల్లర్ట్ హొటల్లో స్నానాలగదులలో ఉండే రంగు రంగుల టైల్స్ చూడటానికీ, ఇంకా ఆ గదులలో భూమి నుండి పొంగివచ్చే నీటి నుంచి ఎగసే ఆవిరి అనుభవించడానికి అక్కడికి తీసుకు వెళ్ళమని బ్రతిమలాడేది.



మా అందరికీ నచ్చిన ఒక చోటు ఉంది, కానీ మేము నాన్నని అక్కడికి తీసుకెళ్లమని ఎప్పుడు అడగలేదు, ఎందుకంటే అక్కడికి వెళ్ళడానికి డబ్బు ఖర్చవుతుంది. అమ్మకు పంచదార, వెన్న కొన్నాక, మాలో బాగా పెరిగినవారికి కొత్త ప్యాంటుకి బట్ట, కొత్త బూట్లు కొన్నాక, నాన్న వంటింట్లో నుంచుని, జేబులో చేయి పెట్టి, కాసులు గలగలలాడిస్తూ పెద్ద నవ్వు నవ్వితే, నాన్న వద్ద అదనపు డబ్బు ఉన్నట్టు లెక్క. అప్పుడు అది జంతుప్రదర్శనశాలకు వెళ్లే ఆదివారమని మాకు తెలుసు.



పాకెట్ మనీ ఉన్న మా అన్నయ్య గాబోర్, స్నానాల గదుల నుంచి రైతులు కోడిగుడ్లు, టమాటాలు, కోళ్లు అమ్మతెచ్చే మార్కెట్ కు పరుగులు తీసేవాడు. త్వరలోనే అక్కడ చీజ్ దుకాణాల్లో, మసాలా అమ్మే కౌంటర్లలో కలిసిపోయేవాడు, కానీ ఎప్పుడూ మా అందరికీ క్యాండీతో బయటకువచ్చేవాడు.



మా ఊరి జంతుప్రదర్శనశాల మేమున్న దేగ్గర్నుంచి కొండ దిగి, నది దాటాక వచ్చేది. నాన్న ఇవాని భుజం మీద కూర్చోబెట్టుకుని, నా చేయి పట్టుకుని, గాబోర్ ముందు
పరిగెడుతుండగా మేము కొండా దిగి, నది దాటి పెస్ట్ నగరంలోకి వెళ్ళేవాళ్ళము.



ఇంటికి వచ్చేప్పుడు మూలుగుతూ పైకి ఎక్కే రైలు తీసుకోవచ్చు, కానీ కిందకి వెళ్లడం మాత్రం ఒక పరిగెత్తి పెంటాడే ఆటో, దాగుడుమూతల ఆటో లేదా ఎప్పట్లా నాన్న పొడుపుకథలతోనో. “చిన్న టైబోర్” అని నాన్న నన్ను అడిగేవాడు “లాంచిడ్ వంతెన మీదనున్న నీకిష్టమైన ఆ రాతి సింహాలలో ఏమి లోపం ఉంది? వాటికి ఏమి లేదు?”

నాకు సమాధానం తెలుసు. వాటికి నాలుకలు లేవని నాకు తెలుసు, కాని నేను ఎప్పుడూ నాన్నని సమాధానం చెప్పమనేవాణ్ణి. అప్పుడు మేము నాన్న హృదయపూర్వక నవ్వు వినేవాళ్ళం.

త్వరలో మేము జంతుప్రదర్శనశాల చేరేవాళ్ళం. బెలూన్లు అమ్మే అబ్బాయిలు, ఐస్-క్రీం అమ్మే అమ్మాయిలు ద్వారం ఎదురు వీధిలో బార్లుగా నిలబడి ఉండేవారు.

“త్వరగా, త్వరగా” అని వారిలో ఒకరు అరిచేవారు “ఇది హన్నాకు ఆహారం పెట్టె సమయం”.







హన్నా నీటి ఏనుగు. మా నగరం నీటి ఏనుగులకు ప్రసిద్ధిగాంచింది. వాటికి భూమిలోనుంచి సహజంగా ప్రవహించే వెచ్చటి నీటి బుగ్గలు అంటే ఎంతో ప్రీతి, మరియు వాటిలో అవి బాగా ఆరోగ్యంగా, లావుగా పెరిగి, ప్రపంచమంతటా ఉన్న జంతుప్రదర్శనశాలలకు పంపబడిన ఎన్నో పిల్లల్ని కన్నవి.

మా నగరం నీటిఏనుగులా కోసం జంతుప్రదర్శనశాలలో ఒక చక్కటి ఇల్లు కట్టింది. ద్వారం బయట ఒక నీటి మడుగుతో, చిన్న నీటి మడుగులు ఉన్న వేరు వేరు గదులతో, రాగి బురుజులతో అది ఒక చిన్న రాజా భవంతిలా ఉండేది. నీటి ఏనుగుల భవంతి చుట్టూ చెట్లూ, పూలమొక్కలూ నాటిఉండి, దానిలో నీరు ఎప్పుడూ పరిశుభ్రంగా ఉండేది.



హన్నా ఒక ప్రత్యేకమైన నీటి ఏనుగు. తాను సందర్శకులకు దెగ్గరగా బయట ఉన్న నీటి మడుగులో ఉండడం ఇష్టపడేది. పచ్చగడ్డి, ఎండుగడ్డి నిండిన బండి మెలుకుల దారిగుండా కీచుమంటూ వస్తుంటే చూడగలనన్న ఆశతో తను ఎప్పుడూ ఒక కన్ను తెరిచి పడుకునేది. ఇతర నీటి ఏనుగులు విశ్రాంతి తీసుకుంటుంటే, హన్నా మాత్రం ఆ బండి, పక్కనే ఉన్నా జిరాఫీ గుహ వద్దకు వచ్చేసరికి లేచి కూర్చునేది. జూకీపర్ తన పిచ్ఫోర్క్ తో మొదట విడత ఎండుగడ్డి ఎత్తి గాలిలో సగం దూరం తెచ్చేసరికి హన్నా ఒక్కతే నోరు తెరిచి సిదంగా ఉండేది.

కీపర్ ఇక ఏమాత్రం గడ్డి దూర్చలేనంత వరకు హన్నా తన నోరు తెరచి ఉంచి, ఆ వెంటనే, నీటిఏనుగు ఎంత గబగబా నోరు మూయగలదో అంత తొందరగా నోరు మూసేసేది. మరుక్షణం గడ్డి మొత్తం మాయమై తన నోరు మళ్లి తెరుచుకునేది.

గుంపులో అంతా నవ్వేవారు, నాన్న అందరికంటే గట్టిగా. ఆ ఒక్క పొడుపుకదా తాను కూడా విప్పలేకపోయేవాడు.





ప్రజలు తలలు అడ్డంగా ఊపి, వారి వారి పనులకు వెళ్లి, ఇంటికి తిరిగి వచ్చి, ఇళ్ళలోపల ఉండేవారు. నాన్న ఇక మమ్మల్ని ఆదివారం బయటకు తీసుకువెళ్ళలేదు. మేము ఫైర్ప్లేస్ పక్కన కూర్చుని మా పాఠాలు చదువుకుని, చిరిగినా మా బట్టలు కొట్టుకుని, ఏదైనా మెరుగైన వార్త వినిపిస్తుందేమోనన్న ఆశతో రేడియో వినేవాళ్ళం. కానీ సైనికులు ఉండిపోయారు, రోజులు ఇంకా చల్లగా మారాయి. మొదట మా మాంసాహారం అయిపోయింది, తరవాత మా ఆలుగడ్డలు. నాన్న మార్కెట్ నుంచి కొద్ది పాటి ఉల్లిపాయలు, క్యారెట్లతో ఇల్లు చేరుకునేవాడు. ఈ కూరగాయలతో, మరియు ఒక్కొక్కసారి మా ఇరుగుపొరుగు ఇచ్చిన ఒక సన్నని కోడితో అమ్మ మా సూపుకుండలోని సూపును సాగదీసి కుండను నింపశక్యం చేసేది.



ఒక శీతాకాలం జంటనగరాలైన బుడా మరియు పెస్ట్ నగరాల మధ్య నది మంచుగడ్డగా మారిపోయింది. అంత ఎక్కువ నీరు ఉన్న అంత పెద్ద నది గడ్డకట్టడానికి ఆ శీతాకాలం ఎంతో చలిగా ఉండి ఉండాలి. కానీ దాని గురించి ఎవరూ అంతగా మాట్లాడలేదు, ఎందుకంటే అంతకంటే ముఖ్యమైన విషయం మాకు జరుగుతున్నది కాబట్టి. యూరోపులో భాగమైన మా మొత్తం ప్రదేశంలోనూ, ఇంకా ఇతర ప్రాంతాలలోనూ యుద్ధం జరుగుతోంది. ఇప్పుడు మా పట్టణంలో సైనికులు ఉన్నారు, నదికి ఇరువైపులా ఉన్నారు, నది ఇరువైపుల వారూ ఒకరితో ఒకరు యుద్ధం చేస్తున్నారు.

మా ఖాళి కడుపుల గురించి ఆలోచించడంలో నిమగ్నమైన మమ్మల్ని నాన్న చెప్పిన వార్త ఆశ్చర్యపరిచింది. “జంతుప్రదర్శనశాలలో జంతువులూ కూడా ఆకలితో ఉన్నాయి” అన్నాడు. “సైనికులవల్ల ఆహారం ఏదీ పట్నంలోకి రావట్లేదని నేను విన్నాను, మరియు ఇంత చలిగా ఉన్న శీతాకాలంలో జంతువులకు మరింత ఆహారం కావాలి. మేము హన్నా గురించి, తన విస్తృత నవ్వు గురించి, మరియు తన నోట్లో ఎంత ఎండుగడ్డి పట్టగలదో దానిగురించి తెలుచుకున్నాము. ఆ వేసవిలో తనకి పుట్టిన పిల్ల గురించి, మరియు జంతుప్రదర్శనశాలలో మా ఇతర నీటిఏనుగుల గురించి తలుచుకున్నాము. ఆ రోజు రాత్రి నిస్సహాయతతో, బాధతో పడుకోవడానికి వెళ్ళాము.



ఉదయం నాన్న తన సూటుతో వంటింట్లోకి వచ్చాడు. తన చేతులు తన జేబులో ఉన్నాయి మరియు తన ముఖంపై పెద్ద నవ్వు ఉంది. “మనం జంతుప్రదర్శనశాలకి వెళ్తున్నాం” అని తాను చెప్పాడు “కానీ వినోదం కోసం కాదు. ఈ రోజు మనం జంతుప్రదర్శనశాలని రక్షించడానికి వెళ్తున్నాం. పిల్లలు మీరు తయారై నాతో వస్తే ఎలాగో చూబిస్తాను”





మేము మా గదుల్లోకి పరుగులుతీసి, మరుక్షణంలో వంటింట్లోకి వచ్చేసాం. అమ్మ మా మెడల చుట్టూ మాఫ్లర్లు చుట్టింది. ఆమె కనిపించే తీరు చూస్తే, రాత్రంతా తాను నాన్న నీటిఏనుగులను రక్షించడానికి ఉపాయం ఆలోచించారని, అది మంచి ఉపాయమని మాకు అర్ధమయింది. ఇంటి నుంచి బయటికి వెళ్తుంటే నాన్న మా గడ్డి కాళ్ళ పీచు, గడ్డి చెప్పులూ తీసుకున్నాడు. గాబోన్, ఇవ, నేను గుసగుసలు ఆడుకున్నాంగానీ, నాన్న అనుకున్నప్పుడే తన రహస్యాన్ని చెప్తాడని మాకు తెలుసు.

జంతుప్రదర్శనశాలకి వెళ్లే దారిలో నాన్న, తానూ అమ్మా ఆలోచించిన ఉపాయం గురించి చెప్పాడు. "మనం మొట్టమొదట జూకీపర్ దెగ్గరికి వెళ్తాము" అని నాన్న అన్నాడు "అతనిని నీటిఏనుగులశాలకి తీసుకువెళ్లి మన ఉపాయం పారుతుందని చూపిస్తాం".

మేము నీటిఏనుగులాసాలకి వెళ్లేసరికి, అక్కడ మాకు మంచుతో గడ్డ కట్టేసిన మడుగు, బోసిపోయిన చెట్లూ కనిపించాయి. నీటిఏనుగులు వెచ్చదనంకోసం, గాలి నుండి ఆశ్రయం కోసం, లోపల గుమిగూడి ఒకదాన్నొకటి ఆనుకుని నుంచుని ఉన్నాయి. హన్నా ఇక మావైపు చూడలేదు, ఇక ఒక కన్ను తెరిచి నిద్రపోలేదు. మేము తాను అసల ఏ నీటిఏనుగో కూడా చెప్పడం కష్టతరమైంది.





నాన్న కృంగిపోయిన జంతువుల దెగ్గరకు వెళ్లి నెమ్మదిగా గడ్డి కాళ్ళపీచును ఒకదాని ముక్కు కింద పెట్టాడు. ఆ నీటిఏనుగు కదిలింది కానీ తినలేదు. అంచేత నాన్న పిచ్ఫోర్క్ తీసుకుని, ఆ గడ్డిపీచును చింపి ముక్కలు చెస్, ఆ ముక్కలన్నీ పిచ్ఫోర్క్ చివర పెట్టాడు. అప్పుడు మా చిరిగిపోయిన పీచును ఒక నీటిఏనుగుకి ఇచ్చాడు. ఆ నీటిఏనుగు తనని తానూ పైకి లేపి, నోరు తెరిచింది, ఇక పీచు ఒక్క మెరుపులో మాయమైంది. “శభాష్” అన్నాడు జూకీపర్ “శభాష్”.



ఆ రోజు తర్వాత చల్లటి రాత్రులలో, మబ్బు కమ్మిన ఉదయాలలో, పొగమంచుతో, ముసురులో, మంచులో, ఒక పాతబండి, ఇంకా ముసలి గుర్రం లాగుతుండగా, బడా మరియు పేస్ట్ నగర వీధుల్లో తిరిగేది. “నీటిఏనుగులకు ఆహారం ఇవ్వండి, నీటిఏనుగులకు ఎండుగడ్డి” అని ఆ బండివాడి గొంతు నగర వీధుల్లో ప్రతిధ్వనించేది.





మా పట్టణంలోని ప్రజలు ఇళ్లలోంచి బయటకు పరుగున వచ్చి వారి గడ్డి కళ్ళపీచులూ, చెప్పులు, టోపీలూ బండిలో కుప్పలుగా పోశారు. బండి మళ్ళీ,మళ్ళీ నిండగా, ఆ ముసలి గుర్రం ఎంతో నమ్మకంగా ప్రతీ కుప్పనీ జంతుప్రదర్శనశాలలోని హన్నా మరియు ఇతర నీటిఏనుగుల వద్దకు లాక్కు వెళ్ళేది. శీతాకాలం చివరికల్లా బుడాపెస్ట్ ప్రజలు నీటిఏనుగులకు తొమ్మిదివేల టోపీలు, చెప్పులూ, పీచులూ ఇచ్చారు. నీటిఏనుగులు లావు అవలేదు కానీ ఆ గడ్డి వాటిని ఆ భయంకలిగించే శీతాకాలం చలిలో సజీవంగా ఉంచింది.





మా పట్టణంలో యుద్ధం ఆ వసంతంలో ముగిసింది. ఇప్పుడు నేను పెరిగి పెద్దయ్యాను. ఆ చల్లటి శీతాకాలం మరియు ఆ సైనికులూ ఒక జ్ఞాపకం మాత్రమే. కానీ బుడాపెస్ట్ లోని నీటిఏనుగులు ఇంకా వాటి భవంతిలో నివసిస్తూ, ఆ వెచ్చని నీటి బుగ్గలలో పొర్లాడుతూ ఉన్నాయి. ఆ రోజులనుంచి నేను దూరంగా పయనించాను. కానీ ప్రతీసారి నేను ఎదో ఒక చోట జన్తోప్రదర్శనశాలలోని నీటిఏనుగును చూసినప్పుడు హన్నా గురించి, నాన్న గురించి, తొమ్మిదివేల గడ్డి చెప్పులతో యుద్ధ సమయంలో వారి నీటిఏనుగులను రక్షించుకున్న ధైర్యవంతులైన మా పట్టణ ప్రజల గురించి తలుచుకుంటాను.

**రచయిత యొక్క గమనిక:**

ఈ కథ ఒక నిజ సంఘటన మీద ఆధారితమైనది. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో (1939-45), హంగేరి, కొన్ని ఏళ్ళల్లోకెల్లా అతి చల్లటి శీతాకాలాన్ని అనుభవించింది. జంట నగరాలైన బడా మరియు పేస్ట్ ను విడదీసే డాన్యూబ్ నది సైతం గడ్డకట్టేసింది. జర్మనీ సైనికులు ఒక వైపు ఉండగా, రష్యన్ సైనికులు మరొకవైపు ఉన్నారు. ప్రజలూ అలాగే జంతుప్రదర్శనశాలలోని జంతువులూ ఆకలితో అలమటిస్తున్నారు. కానీ బుడాపెస్ట్ లోని నీటి బుగ్గలలో ప్రవహించే వెచ్చటి నీటిలో అభివృద్ధిచెందే హంగేరి యొక్క ప్రసిద్ధి గాంచిన నీటిఏనుగులు, బుడాపెస్ట్ ప్రజలు దానం చేసిన తొమ్మిదివేల గడ్డి చెప్పులూ, కాల్లప్పులూ, టోపీలూ, తినిపించబడ్డాయి. నీటిఏనుగులు ఆ చల్లటి శీతాకాలం నుండీ , యుద్ధం నుండీ బతికి బయటపడ్డాయి.

శుభం